Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] మద్రాసు : 1942 వ సం॥ జనవరి నెల 23 వ తేదీ శుక్రవారం [నె 3 రు

## హిట్లరు జాతకం.

హిట్లరు ప్రభ యింతవరకూ అఖండంగానే సాగింది. అంత అఖండజ్యోతిగా వెలిగే దీపం మెరుపు తీగెవంటిదేగాని నిలకడగానిలిచి వెలిగేదికాదు. హిట్లరు కనిపెట్టిన కొత్త యుద్ధ పద్ధతి యేమిటంటే, మబ్బులలో మెరుపుతీగె మెరిసినట్లుగా అగ్నివర్షం కురిపించి ఆకస్మికంగా శత్రు సైన్యాలమీద దండెత్తడం. పరుగెత్తినంత సేపూ ఊపిరి సలుపకుండా పరుగెత్తడం. కొట్టినంత సేపూ, ఎదుటివాడు గుక్క తిప్పుకొనుటకు వీలులేకుండా కొట్టడం. ఇటువంటి యుద్ధ పద్ధతివల్ల యెటువంటి శత్రువునైనా జయించవచ్చునని హిట్లరు సిద్ధాంతం. ఈ యుద్ధ పద్ధతినే, జర్మను భాషలో "బ్లిట్జ్" అంటారు. మెరుపు తీగెలాగున ఒక్క క్షణంలో విరుచుకొని మీదపడాలి. చెట్టుమీద పిడుగుపడినట్లుగా క్షణిక వేగంగా శత్రువును మాడ్చి మసిచేసివేయాలి. హిట్లరు కనిపెట్టిన యుద్ధ పద్ధతి యెటువంటిదో, హిట్లరు అవలంబించిన ప్రభుత్వ పద్ధతికూడా అటువంటిదే. నామమాత్రంగా జర్మనీకికూడా శాసన సభ అనేది ఒకటి వుంది. కాని, ఆ శాసన సభలోని సభ్యులు తీర్మానాలు ప్రతిపాదించడంగాని, బలపరచడంగాని, తీర్మానాన్ని చర్చించడంగాని, వోట్లు లెక్కపెట్టడంగాని యేమీలేదు. ఆ సభలో రెండు మూడు పార్టీలు అనేవి వుంటేగదా, ఉభయపక్షాలవారు ఒకవిషయాన్ని మథించడంగాని రాద్ధాంత సిద్ధాంతాలు చేసి, ప్రజాభిప్రాయం తెలియజేసి, సత్యాసత్యములున్నూ యుక్తాయుక్తములున్నూ నిర్ణయించడం? హిట్లరు సభలో వుండేది ఒక్కటే పార్టీ. దానిపేరు నాజీ పార్టీ. ఆ పార్టీకి సర్వస్వతంత్ర నాయకుడు హిట్లరుగారే. ఆయన చెప్పినదానికి "కాదు" అనేవాళ్లు సభలో వుండరు. ఆ సభలో వుండడానికి వీలులేదు. హిట్లరు యేదిచెప్పితే అది అందరూ ఒప్పుకోవలసిందే. ఆయన "నంది" అంటే, అందరూ "నంది" అంటారు. ఆయన "పంది" అంటే, సభలో అందరూ "పంది" అంటారు. ఆ నాజీ పార్టీవారందరూ, ఆయన చుట్టూ రాంభజన చేయవలసిందేగాని, ఆయనతో రచ్చకెక్కి రగడ చెయ్యడానికి వీలులేదు. ఆయనమాటకు యెదురు చెప్పేవాడు యెవడైనా వున్నాడంటే వాడికి చావుమూడినదన్నమాటే. అదో విధమైన బ్రహ్మరాక్షసి ప్రభుత్వ పద్ధతి. జర్మనీదేశం అంటే, ఒక పెద్ద జెయిలు. ఆ జెయిలుకు హిట్లరు అనేవాడు అధికారి. అందువల్ల విస్సన్న చెప్పింది వేదం అన్నట్లుగా ప్రజలందరూ బదులు జవాబు చెప్పకుండా ప్రవర్తిస్తున్నారు. హిట్లరు తాను సంకల్పించిన శాసనములన్నీ జర్మనీలో శరవేగంగా అమలుపరుస్తాడు. శత్రువులమీదకు వెళ్ళినా శరవేగమే. శాసనాలు అమలుపరచినా శరవేగమే. తనకు యెంతతోచితే అంతే. వెనుకాముందూ ఆలోచన అనేది లేనేలేదు. ఇంత శరవేగంగా వ్యవహరించేవాడి బ్రతుకుకూడా శరవేగంగానే సమాప్తమౌతుంది.

హిట్లరుయొక్క వ్యవహార చర్యలు యెంత శరవేగంగా నడుస్తున్నవో, హిట్లరుయొక్క మాటలుకూడా మెరుపు తీగెలు మాదిరిగానే క్షణికంగా వుంటాయి. నేడు చెప్పిన మాటకు రేపటివరకూ నిలకడవుండదు. ఈ రోజున ఖరారు చేసికొని కాగితంమీద సంతకంచేస్తాడు. రేపటి రోజున ఖరారునామాలన్నీ ఖరాబుచేస్తాడు. మళ్లీ మాట్లాడితే, "ఖబర్దార్!" అని చెయ్యి పైకెత్తి పిడికిలి చూపిస్తాడు. మొట్టమొదట చేతిలో చెయ్యివేసి ప్రమాణంచేస్తాడు. "నీకూ నాకూ నేస్తం" అంటాడు. తన అవసరం తీరిన తర్వాత, "పోరా! వెధవా!" అంటాడు. "రష్యాతో జర్మనీకి విరోధమేగాని, సఖ్యత అనేది సాధ్యంకాదు" అని హిట్లరు అనేక సంవత్సరాలు బాహాటంగా ప్రతిజ్ఞ చేసి పలుకుతూవుండేవాడు. కాని, రష్యాతో మంచితనంగా వుండవలసిన అగత్యంవచ్చేటప్పటికి, రష్యాకు మాయమాటలుచెప్పి, లాలించి, తనవైపు ఆకర్షించుకొన్నాడు. తాను జయించిన పోలెండులోని సగంభాగం రష్యాకు దానం చేసాడు. "నా కంఠంలో ప్రాణంవున్నంతవరకూ, రష్యాతో స్నేహం విడిచిపెట్టను" అని రష్యా ప్రభుత్వానికి ప్రమాణం చేసి చెప్పాడు. ఖరారునామాలు వ్రాసి స్వదస్తూరీతో సంతకాలుచేసి సీళ్లువేసియిచ్చాడు. ఫ్రాన్సు మొదలైన రాజ్యాలనన్నింటినీ జయించిన తర్వాత, జర్మను సేనలను రష్యామీదకే నడిపించాడు. హిట్లరుయొక్క మాట యెంత నిలుకడలేనిదో దీనినిబట్టి గ్రహించవచ్చు. మెరుపు తీగె లాగున చంచలమైనది. క్షణభంగురమైనది. హిట్లరుమాట శరవేగంగా మారిపోతుంది. హిట్లరు ప్రభుత్వ శాసనం శరవేగం. హిట్లరు యుద్ధపద్ధతికూడా శరవేగ పద్ధతిలోనే ఉంది. మాట్లాడితే శరవేగం. పోట్లాడితే శరవేగం. అతని బ్రతుకంతా శరవేగమే.

అందుకనే బ్రిటిషు ప్రధానియైన చర్చిలుగారు "1942వ సంవత్సరం ఆఖరువరకు ఓపికపట్టండి" అన్నారు. ఈ అఖండ జాతకుడు అస్తమించే రోజులు సమీపించినవని చర్చిలుగారు అన్ని సందర్భాలూ ఆలోచించి, నిదానంగా లెక్కలువేసి గుణించి చెప్పారు. ఎంతవేగంగా ముందు వెనుకలు చూచుకొనకుండా పరుగెత్తుతాడో, అంత వేగంగా పడిపోతాడు. ఏ వ్యాపారంలోనైనా అంతే. రాజ్యాలు గెల్చినా, వ్యాజ్యాలు గెల్చినా, ఆస్తి అనుభవించే యోగ్యత, గెల్చినంతమాత్రంచేత రాదు. గెల్చినదంతా నిల్చేదికాదు. మొన్న నీ మధ్య చర్చిలుగారు అమెరికాకు స్వయంగా వెళ్లి, అక్కడ అమెరికా ప్రెసిడెంటు రూజువెల్టుగారితో సావకాశంగా అన్ని సంగతులూ మాట్లాడుకొని వచ్చారు. ఇద్దరూకలిసి హిట్లరుజాతకం గుణించిచూచారు. 1942 వ సంవత్సరం ఆఖరుకు ఆ జాతకం అస్తమించక తప్పదని నిర్ణయించారు. ఏయే రాసులలో యేయే గ్రహాలు ఉన్నాయో, ఆ గ్రహ వీక్షణాలు ఎట్లా ఉన్నాయో, వాటి ఫలిత పర్యవసానమేమిటో యుద్ధ జ్యోతిషం తెలిసిన చర్చిలుగారికిన్ని, రూజువెల్టుగారికిన్ని మాత్రమే వివరంగా తెలుసు. ఇంత అఖండప్రభగా వెలుగుతున్న హిట్లరు ఇంత వేగంగా ఎట్లా అస్తమించగలడని అనుమానించేవాళ్లు చాలామంది ఉంటారు. అతి వేగంగా పైకివచ్చేవాడికి అస్తమయంకూడా అతి వేగంగానే ఉంటుంది. ఆ జాతక లక్షణం అటువంటిది. అది తాటియాకు మంటవంటిది.

ఏ విధంగా హిట్లరుయొక్క యుద్ధతంత్రానికి విఘాతాలు వస్తాయో, చర్చిలుగారుగాని, రూజువెల్టుగారుగాని వివరంగా యిప్పుడు లోకానికి చెప్పదలచుకోలేదు. వారి మాటలలో ఉన్న నిజంనిలుకడమీదగాని ఋజువుకాదు. ఆశ్వాపాంతం చూస్తే, అమెరికా-ఇంగ్లాండుల గణిత ఫలితం విదితమౌతుంది. నిదానంగాచూడండి—నిదర్శనాలు కన్పిస్తాయి.

ఉదాహరణ కొకటి చూడవచ్చు. సింగపూరుదగ్గర జపాను సేనలు జయించుకొని వస్తున్నవనిన్నీ, రెండు బ్రిటిష్ యుద్ధనావలను జపానువారు సింగపూరువద్ద ముంచివేసినారనిన్నీ, పసిఫిక్కు సముద్రంలో అమెరికావారికి చెందిన ఫిలిప్పయిను దీవులలోకి జపానువారు ప్రవేశించినారనిన్నీ, తూర్పు ఖండంలో అమెరికావారి బలమును, బ్రిటిష్‌వారి బలమును జపానువారు పటాపంచలుచేసి వేస్తున్నారు గనుక మన ఇండియాకు పడమరగానున్న టర్కీ, పరిషియా, అరేబియా వగైరా రాజ్యాలమీదుగా జర్మనీవారుకూడా దండయాత్ర సాగించడానికి ఇదే దివ్యమైన ముహూర్తమనిన్నీ, జర్మను ప్రభుత్వ వ్యవహారాలలో హిట్లరుకు కుడిభుజమైన గోబెల్సుగారు మొన్న చంకలు కొట్టుకుంటూ ఒక పెద్ద ప్రసంగంచేసారు. "సింగపూరువద్ద బ్రిటిష్‌వారు ఉంచిన రెండు పెద్ద యుద్ధనావలు గంగపాలైన తర్వాత, ఇంకా సింగపూరేమిటి, సింగినాదం జీలకర్ర?" అని గోబెల్సుగారు అనుకున్నారు. కాని, నిన్న నొక జపాను విమానం సింగపూరుకు వాయువ్యదిశగా ఎగురుతూఉంటే మలయా సమీపంలోనే మలాకా సముద్రంలో మూడు పెద్ద యుద్ధనావలు ఆ జపాను విమానంలో ఉన్నవానికి కన్పించాయి. ఒక్కొక్క యుద్ధనావ 30 వేల టన్నుల యుద్ధనావ అని గుర్తుపట్టినాడు. వెంటనే, "మన కొంప మునిగిందిరా బాబూ!" అని ఇండో చైనాకువచ్చి అక్కడ ఉన్న జపాను సైనికాధికారులతో యీమాట చెప్పాడు. ఆ మాట ఇండో చైనా రేడియోద్వారా మొన్న బయటపడింది. "రెండు పెద్ద బ్రిటిష్ యుద్ధనావలను సింగపూరువద్ద సముద్రంలో ముంచివేసినాముగదా ఇక మనకు అపాయములేదని జపానువారు సంతోషిస్తూఉంటే, సింహస్వప్నంలాగున యీ మూడు పెద్ద యుద్ధనావలూ వాళ్లకు ప్రత్యక్షమైనాయి. ఇవి అమెరికను యుద్ధనావలేమో! అమెరికను యుద్ధ నావలైనట్లయితే, అవి మలాకా సముద్రంలోనికి ఎట్లా ఏమార్గంగా వచ్చాయి? ఎప్పుడువచ్చి చేరినవి?

ఇంతంత బ్రహ్మాండమైన ముప్పదివేలటన్నుల యుద్ధనావలను జయించడం ఎట్లా? జపాను సేనల గుండెలలో ఫిరంగిగుండుపడినట్లుగాఉంది. "సింగపూరు జయించడం ఎంతపని?" అని గంతులువేస్తున్న జపాను సేనలకు తిరిగిసింగపూరువద్దనే కంగారు పుట్టుతోంది. సింగపూరువద్ద జపాను సేనలకు బ్రిటిష్ సేనలతో బ్రహ్మాండమైన యుద్ధం సిద్ధంగాఉంది. సింగపూరుకు బ్రిటిష్‌వారు కొత్త సేనలను యీవరకే యీ మధ్యకాలంలో పంపించారు. సింగపూరుకు ఉత్తరంగా మువారు అనే నదీప్రాంతంలో ఆస్ట్రేలియా పటాలములు జపానుసేనలను అడ్డగిస్తున్నాయి. అక్కడికి ఆస్ట్రేలియా విమానాలుకూడా తండోపతండాలుగా మిడతల దండులాగున వెళ్లినవి. సింగపూరులో జపానువాళ్లు సింహాసన మెక్కవచ్చునని ఆశపడుతున్నారు. కాని, వాళ్లకు సింగపూరులోనేఉంది యమలోకసింహద్వారం.

జపాను సైన్యాలు సింగపూరుసింహద్వారం ప్రవేశించడానికి పరుగెత్తుకొని వస్తూవుంటే, "ఇదే మంచి సమయమురా" అని చైనాలో వున్న జపాను సేనలను అక్కడవుండే చైనాసేనలు అటుయిటు పోనీయకుండా అరికట్టి వూరుపేరు లేకుండా రూపుమాపుతున్నాయి. 40 వేల జపాను సేనను ఒక్కచక్కని కత్తెర వ్యూహంలో నొక్కి ముక్కలుముక్కలుగా ఆహుతిచేస్తున్నవి. చైనాలో ఆరు జిల్లాలలో జపాను సేనలను చైనాసైనికులు వేటకుక్కలవలె వేటాడుతున్నారు. వేలకొలదిగా చచ్చిపోతున్న జపాను సైనికులకు అక్కడే పెద్దపెద్ద గోతులు తవ్వించి భూశయనం చేస్తున్నారు. చైనా సేనలకు యీ విధంగా దిక్కి, దిక్కుమొక్కులేక చచ్చిన జపాను సైనికులకు చైనావారే ఉత్తరక్రియలు చేస్తున్నారు. అటువంటి అనాథప్రేత సంస్కారం చేస్తున్న చైనావారి ఋణం జపానువారు ఎన్ని జన్మాలకైనా తీర్చుకోలేరు.

చైనా సేనలు చైనాలో మాత్రమే తమ ప్రతాపం చూపించడం లేదు. బర్మాలోకికూడా చైనాసేనలు కొన్ని లక్షలు వచ్చి, జపాను సేనలకు జవాబుచెప్పుటకై సిద్ధంగా వున్నవి. జపానుసేనలకు చైనాసేనలు బర్మాలోకూడా కర్మచేయవలసి వస్తుంది. అయిదేళ్లనుంచీ చైనాలో జపానువారు చేస్తున్న యుద్ధం మూలంగా చైనాసేనలు సానబెట్టిన కత్తులలాగున బాగా ఆరితేరిన వీరులైనారు. ఇప్పుడు సమయం దొరికిందిగదా అని కారాలు మిరియాలు నూరుతున్నారు. జపానువాళ్లు కన్పిస్తేచాలు, కస్సిరచేసి, నిప్పులు కురిపిస్తున్నారు. అమెరికా సప్లయిచేస్తున్న ఆయుధాలతో, చైనా యోధులు బర్మా సరిహద్దులలో కోటగోడలులాగున అభేద్యంగా నిల్చున్నారు.

జపానుసేనలు సింగపూరు సింహద్వారంలో ప్రవేశించినప్పుడు, ఆ సింహలగ్నంలోనే తనకుకూడా గొప్ప దశ యెత్తుకుంటుందనిన్నీ, అప్పుడే తన సేనలనుకూడా నడిపించవలెననిన్నీ, హిట్లరు ఆశపడుతున్నాడు. కాని, జపానువాళ్లకు జాతకం చైనాలో ఎట్లా తిరుగుతూ వున్నదో, జర్మనీవాళ్లకుకూడా రష్యాలో అట్లాగే తిరుగుతోంది. మాస్కోనగరాన్ని ముట్టడించాలనే గట్టి ప్రయత్నంతో మాస్కో సమీపానికి ముందంజవేసిన జర్మనుసేనలన్నీ వెనుకంజ వేసినాయి. హిట్లరు స్వయంగా అక్కడి యుద్ధ రంగానికి వెళ్లి, తానే సర్వ సేనాధిపత్యం వహించి, రోజుకొక వూరుచొప్పున మకాం చేయిస్తూ, వచ్చిన దోవ ఏదో చూపిస్తున్నాడు. "రష్యాలో చలికి చలించం" అని ఉత్తరకుమార ప్రజ్ఞలు పల్కిన హిట్లరే "ఇహిహీ" అని చలికి వణుకుతున్నాడు. రష్యాను గజగజలాడిస్తానని చెప్పినవాడు తానే ఆ మంచుగడ్డలలో గజగజలాడుతున్నాడు. మాస్కోనుంచి మోజేస్కువరకు జర్మను సేనలను రష్యావారు తరిమివేసారు. రష్యాప్రతాపానికి రష్యను మంచుగడ్డల శైత్యానికి, యీ రెంటికీ మధ్య జర్మను సైనికులు చచ్చీచెడి చేయంగల విన్నపాలు అన్నట్లుగా, ఎక్కడి ఆయుధ సామగ్రులను అక్కడే విడిచిపెట్టి, "బ్రతికిబాగుంటే బలుసాకైనా తినవచ్చు" నన్నట్లుగా పారిపోతున్నారు. జర్మనులు వదిలిపెట్టిన ఫిరంగులతో, జర్మనుల మందుగుండు సామగ్రితో, ఆ జర్మను సోల్జరులమీదనే రష్యనులు కాలుస్తున్నారు. రష్యనులకు మందుగుండుఖర్చుకూడా లేకుండా జర్మనులే సహాయం చేస్తున్నారు. అటువంటి త్యాగమూర్తులైన జర్మను సోల్జరులకు వెన్వెంటనే రష్యనులు వీరస్వర్గం లభింపజేస్తున్నారు. చైనాలో సమాధి జపానువారికిన్నీ, రష్యాలో సమాధి జర్మనులకున్నూ బ్రహ్మ నిర్ణయించినట్లుగా ఉంది.

జపాను తన పక్షంలో చేరివున్నది గనుక తనకు అనేక విధాలుగా అక్కరకువస్తుందని హిట్లరు గంపెడంత ఆశతో వున్నాడు. జపానువాడు తన చేతికి అక్కరకువచ్చి తన్నుకూడా ఉద్ధరించి తరింపజేస్తాడని నమ్ముకొని వున్నాడు. అయినా, హిట్లరు బ్రహ్మచారికి జపానువాడే ఉత్తర

గతులు చూపవలసివస్తుంది పెళ్ళిగాని పేరంటంగాని లేని ఆ బ్రహ్మచారికి పుత్రసంతానం ఎక్కడనుంచి వస్తుంది? జర్మనీవాళ్లుకూడా ఆర్యజాతివాళ్లమే అని చెప్పుకుంటారు. ఆర్యధర్మ శాస్త్రప్రకారంగా, పుత్రులులేనివాళ్లకు గతులు లేవంటారు గనుక, హిట్లరు ఎవరినైతే తనదగ్గరకు చేరదీసి తనకు అండగా చేర్చుకొన్నాడో, ఆ జపానువాళ్లద్వారానే తనకు ఉత్తరగతి చూచుకుంటున్నాడు. రష్యాలో హిట్లరుకు ఎటువంటి గతి పట్టిందో చూస్తే, రష్యా యుద్ధంలోనే జర్మనీకి జరుగవలసిన కర్మయావత్తూ పూర్తి అయ్యేటట్లుగా ఉంది.

నిజం ఆలోచిస్తే జర్మనీకి రష్యాకంటె సన్నిహితంగా, సమానస్థాయిలో ఉండే దేశం ఇంకేదీలేదు. కనుక రష్యాలోనే హిట్లరు కథ పూర్తిఅయితే కావచ్చు. అప్పుడుఅంతా సవ్యంగానే జరిగిందని లోకంకూడా మెచ్చుకుంటుంది. కాని, బ్రిటిషువారు, అమెరికావారుకూడా నడుముకట్టుకొని నిలువబడియున్నారు. లిబియాలో జర్మనుసేనలకు ప్రాయశ్చిత్తం బ్రిటిషు సేనలు బాగా చేస్తున్నాయి. మొన్ననే హాల్ఫియా దగ్గర జర్మను సేనలను చావగొట్టి, మళ్లీ అక్కడ అడుగుపెట్టకుండా చేశాయి. మధ్యధరా సముద్రతీరంగావున్న యీ ఉత్తరాఫ్రికా ప్రాంతంలో హిట్లరుయొక్క సేనలు విజృంభించడానికి, అప్పుడప్పుడు ప్రయత్నించడం, మళ్లీ విరమించడం జరుగుతూఉన్నదేగాని, పట్టుదలగా పోరాడలేకుండా ఉన్నాయి. రవ్వంత ఎండలు ముదిరితే, ఆ ఎడారులలో ఎండలు మండిపోతూవుంటాయి. లిబియాలో తాగడానికి మంచినీళ్లుకూడా దొరకవు. ఇసుక దుమారాలు, సుడిగాలులు పైకి లేస్తే, పైనుంచి ఇసుక వర్షం కురుస్తుంది. ఆ ఎడారులలో గుడారాలువేసి ఆ ఎండలలో దండయాత్ర యమకింకరులైనా చెయ్యలేరు.

జర్మను సేనలకు అటు లిబియాలో ఒక వైపున దెబ్బ తగులుతోంది. ఇటు రష్యాలో ఇంకొక వైపున దెబ్బ తగులుతోంది. హిట్లరుకు భగవంతుడు రెండు చెంపలమీదా రెండు దెబ్బలూ కొడ్తున్నాడు; మూలుగుతున్న నక్కమీదనే తాటికాయ పడిందన్నట్లుగా, అటు అమెరికాలోనూ కత్తులు నూరుతున్నారు. అక్కడ ఈ సంవత్సరం 20 వేల విమానాలూ, 45 వేల టాంకులూ, తయారు చేస్తున్నారు. బ్రిటిష్‌వారి సామ్రాజ్యంయావత్తు సమరసన్నాహాలతో సవాలు చేస్తోంది. అమెరికా, ఇంగ్లాండు, రష్యా, చైనా యివి అన్నీ ఒక్కసారిగా సమ్మేళనమై రణభేరీ మ్రోగించి, మేళం చేస్తున్నాయి. నిజంగా, జర్మను మంత్రియైన గోబెల్సు చెప్పినట్లుగా "ఇదే దివ్యమైన సుముహూర్తం".

కాని, హిట్లరుజాతకంప్రకారంగా యీముహూర్తంలోనే దశ తిరుగుతుంది. ఆ మాట చర్చిలుగారు ఖండితంగా చెప్పుతున్నారు. జర్మనీని ఎటువంటి ఘోర యుద్ధంలోకి హిట్లరు దింపినాడో జర్మను ప్రజలందరున్నూ గ్రహించి కళ్లు తెరిచే రోజులు వస్తున్నాయి. హిట్లరు తమకు చెప్పేది హితోపదేశం కాదని గ్రహించి నాజీ పార్టీ రాజీకి వస్తుంది. జర్మనీలోనే జనసంక్షోభం కలుగకతప్పదు. "హిట్లరుకు జయ్" అన్నవాళ్లే "నోరు ముయ్" అంటారు. అప్పుడు హిట్లరు ముఠాలోచేరిన ఇటలీగాని, జపానుగాని హిట్లరును కాపాడలేదు. హిట్లరుయొక్క ఆశ్వాసం ఏనాడు ముగిసిందో, ఆ నాడే హిట్లరు జయించిన రాజ్యాలకన్నింటికీ, అనగా ఫ్రాన్సు, పోలెండు, హాలెండు, బెల్జియం వగైరా రాజ్యాలకన్నింటికీ, లోకశాంతి ప్రతిష్ఠాపన సభలో సంపూర్ణ స్వాతంత్ర్య ప్రదానం జరుగుతుంది. జపాను జయించిన రాజ్యాలకు తాత్కాలికంగా గ్రహణంపట్టినా అదికూడా వదలిపోతుంది. ప్రపంచచరిత్రలో నూతనయుగం ప్రారంభమవుతుంది.

అమెరికాకువెళ్లి అక్కడ రూజువెల్టుగారితో మన బ్రిటిష్ ప్రధానియైన చర్చిలుగారు చేసిన సంప్రతింపులు సామాన్యమైనవికావు. బ్రహ్మాండమైన ప్రయత్నాలు సంకల్పించారు. అమెరికా యుద్ధరంగానికి కదలి వచ్చిందంటే జగన్నాథ రథం కదలి వచ్చినదని భావించాలి. అమెరికా రాజ్యంలో వున్న విమాన ఫ్యాక్టరీలు, ఆయుధాల ఫ్యాక్టరీలు కోట్లకొలది ద్రవ్యంతో, లక్షల కొలది పనివాండ్లతో మహాప్రవాహంలాగున సామగ్రిని సప్లయి చేసేటటువంటివి. కుబేరులవంటి ఐశ్వర్యవంతులకు అమెరికా రాజ్యం పుట్టినిల్లు. అంగ బలం, అర్థ బలం, ఆయుధ బలం, సమృద్ధిగా వున్న రాజ్యంఅది. నాగరిక ప్రపంచానికి తీర్పు చెప్పగల సభాధిపత్యం అమెరికా రాజ్యానిదే. అటువంటి అమెరికాతో వైరం హిట్లరు పెట్టుకున్నాడు. అటువంటి అమెరికాతో వైరం జపాను పెట్టుకున్నది. ఈ విషయంలో జర్మనీని చూచి జపాను వాత పెట్టుకున్నదో, జపానునుచూచి జర్మనీ వాత పెట్టుకున్నదోగాని, ఇద్దరికీ బుద్ధి వచ్చేటట్లుగా అమెరికా వాత పెట్టుటకు సిద్ధంగావుంది.

హిట్లరుజాతకాన్ని అమెరికా అధ్యక్షుడైన రూజువెల్టుగారుకూడా చాలా శ్రద్ధగా పరిశీలించి చూచారు. హిట్లరుయొక్క యుద్ధ తంత్రం అర్థం చేసుకొన్నారు. దానికి తగిన ప్రతిక్రియలన్నీ ఒక ప్రాయశ్చిత్త కాండగా నిర్ణయించుకున్నారు. చెప్పవలసిన రహస్యాలన్నీ చర్చిలుగారికి చెప్పి ఇంగ్లాండుకు పంపించారు. ఇకనుంచీ హిట్లరుయొక్క జాతకచక్రం వారి చేతులలో వుంటుంది. తాత్కాలికంగా యింకా కొన్ని దినాలవరకూ, హిట్లరు ప్రతాపంగాని, జపాను ఆర్భాటంగాని హెచ్చుగా కన్పిస్తే కన్పించుగాక. కాని, హిట్లరుకు హీనదశ త్వరలోనే వస్తుంది. ఎట్లా వస్తుంది? అని అడుగుతారేమో! రూజువెల్టున్నూ చర్చిలున్నూ కలిసి గుణించిన హిట్లరుజాతకచక్రమునుబట్టి ఆ హీనదశ త్వరలోనే వస్తుంది. నాజీ రాజ్యము నాశనమౌతుంది. ఆమాట నమ్మండి. "నమ్మినవారి కెన్నటికి నాశముగల్గదు భారతీయుడా!" ఇదే చర్చిలుగారి విజయ మంత్రం.

# హిట్లరు ఏవైపు దాడి ప్రారంభిస్తాడు.

## రష్యా, లిబియాలందు అతని ఓటమి—మాల్టాపై దాడి. అమెరికా స్థిరసంకల్పం. ఆయుధాల ఉత్పత్తి హెచ్చుట.

పశిఫికు మహాసముద్రమునందలి పరిస్థితులు కొంత నిరుత్సాహకరంగా వున్నప్పటికీ దూరదృష్టితో ఆలోచిస్తే, యీ నూతన వత్సరమునందు మిత్రమండలి దేశాలకు చాల విజయం చేకూరే సూచన లగుపడగలవు. అట్లాంటికు సముద్రమునందు, ఆఫ్రికా—యూరోపు మధ్యసముద్రమునందు లిబియాయందు, రష్యాయందు జర్మను ఇటలీల శక్తి సన్నగిల్లుచున్నది. అక్కడ వారి ఆటలు సాగుటలేదు. జర్మను సేనలను ఎవ్వరు ఓడించలేరనే భావం వట్టిభ్రమయని రష్యా సేనలును లిబియాలోని బ్రిటిషు సామ్రాజ్య సేనలును రుజువుచేసినవి.

ఏదో ఒకచోట యిపుడు గెలుస్తేగాని హిట్లరుకి దిక్కులేదు. కావున యీసారి అతడు ప్రారంభించే దాడి చాల పెద్ద ఎత్తుమీద వుంటుందనడానికి సందేహంలేదు. అతడిప్పుడు బ్రిటిషు దీవులపై పెద్ద దాడి ప్రారంభించినా ప్రారంభింపవచ్చును. అట్టి దాడికి సర్వదా సిద్ధంగా వుండాలని బ్రిటిషు ప్రజలకు వారి నాయకులు చెబుతూనే వున్నారు. కాని నిరుడు డంకిర్కునుండి సేనలను మరలించినప్పటి దుస్థితిలో యిపుడు ఇంగ్లాండు లేదు. అందుచే యీపనికి సాహసించేముందు జర్మనునియంత బాగా ఆలోచించుకోవాలి. హిట్లరు స్పెయినును, పోర్చుగలు రాజ్యాలమీదుగ పడమటి ఆఫ్రికాయందు ప్రవేశించి మధ్యధరా సముద్రమునందు బ్రిటిషు నౌకలకు తావులేకుండాచేయాలని అట్లాంటికు సముద్రతీరమునందున్న ఆఫ్రికా రేవులను తానుపయోగించుకోవాలని ప్రయత్నించవచ్చును. అందుకు అతడు ఫ్రాంసు సమ్మతిని బడయవలసియుంది. విషీ ఫ్రాంసు నాయకులిపుడు "ముందుకు వస్తే నుయ్యి వెనక్కువస్తే గోయి" అనే స్థితిలో పడ్డారు. హిట్లరుతో పూర్తిగా ఏకీభవిస్తే లావెలుగారు వారి కూటం సర్వాధికారం వహిస్తారు. హిట్లరుమాట కాదంటే విషీ ప్రజల బాధలు ఎక్కువవుతాయి. కాని యిపుడు అమెరికా యుద్ధంలో చేరినందునను రష్యాలో జర్మనీ సేనలు ఓడుచున్నందునను లిబియాలో బ్రిటిషు దాడి జయించినందునను విషీ ఫ్రాంసు పాలకులకు యించుక ధైర్యం హెచ్చింది. కావున పూర్తిగ హిట్లరుకి లొంగిపోకనుకోవచ్చును. ఆఫ్రికా ఉత్తరమున నున్న ట్రిపోలిటానా రాష్ట్రమునకు బిజార్టామీదగా హిట్లరు క్రొత్తసేనలు పంపవచ్చును; లేదా రష్యా దక్షిణ భాగమగు కాకసనును ఆక్రమించి పెర్షియాలో ప్రవేశించుటకు ప్రయత్నింపవచ్చును.

### మాల్టాపై దాడి.

ఇటలీకి దక్షిణంగా, హిట్లరు సేనలు ఆఫ్రికాకు పోకుండా నిరోధం కల్గించుటకు వీలుగా, బ్రిటిషువారి మాల్టాదీవి అడ్డుగానుంది. దానిపై జర్మను విమానాలు ప్రతిరోజూ గంట గంటకు బాంబులు వేస్తున్నాయి. ఇంగ్లాండులో ఏనగరం ప్రజలూ ఎరుగనంత తీవ్రమయిన బాంబుల దాడికి మాల్టా ప్రజలు గురియగుచున్నను, చాల ధైర్యంగావున్నారు. పసిఫికు సముద్రంలో అమెరికావారి పెరల్ హార్బరు, గువం దీవులను జపాను సులభంగా తీసుకున్నట్లు, అదే పద్ధతులను అనుసరించి సులభంగా మాల్టాను తీసుకోవాలని హిట్లరు ప్రయత్నించుచుండవచ్చును. జపాను తాత్కాలిక విజయం అతనికి ధైర్యం కలిగించియుండవచ్చును. కాని మాల్టాకు పశిఫికు దీవులకు చాల వ్యత్యాసంగలదు. మాల్టా అన్ని ప్రాంతములనుండి రక్షింపబడగలదు. దానిలో తగినన్ని ఫైటరు విమానాలున్నాయి. బ్రిటిషు నౌకాదళం దానికి సర్వవిధములగు సహాయం చేయడానికి చేరువనే సిద్ధంగావుంది.

జర్మను సేనలు కాకసనును ఆక్రమించుటకు టర్కీదేశం గుండా పోవాలి. టర్కీ అందుకు సులభంగా అంగీకరించదు. ఇంగ్లాండుతోగల ఒడంబడికను పూర్తిగ మన్నించుతానని టర్కీ అనేకసార్లు చెప్పియున్నది. అవసరం వచ్చినపుడు సహాయం చేస్తామని టర్కీకి రష్యా-ఇంగ్లాండులు వాగ్దానం చేసినవి. ఇపుడు యీ దేశాలకు టర్కీకి మన స్పర్థలు కలిగించాలని జర్మనీ చేసిన యత్నాలు విఫలమయినాయి. కావున యీ వైపు హిట్లరు వస్తాడనుకుందికి కూడా యిటువంటి ఆటంకాలుంటాయని గ్రహించాలి.

### అమెరికా సహాయం, ఆయుధాల ఉత్పత్తి.

మిత్రమండలి విజయానికి ఎక్కువగ తోడ్పడే యితర హంశం వేరొకటి వుంది. ఇంగ్లాండు, అమెరికా, చీనా, డచ్చి తూర్పు దీవులు రష్యాలు కలిసేయి. ఈ దేశాలన్నింటి శిరి సంపద కలియ గలుపుకొని కలిసిగట్టుగ అక్ష-రాజ్యాలగు జర్మనీ-ఇటలీ-జపానులను ఎదిరించడానికి నిశ్చయించినవి. ఈ కలయికయొక్క మహాశక్తిని గుర్తింపజాలని బుద్ధిమాంద్యులుండరు.

అమెరికా దేశంలో పరిశ్రమలు చాల ఉత్తమస్థితియందున్నవి. అంత ఎక్కువ సంపదగల దేశం ప్రపంచంలో మరొకటిలేదు. ఈ దేశం హిట్లరు తత్వాన్ని పూర్తిగ నాశనం చేయాలని కంకణం కట్టుకుంది. జపానుకి దాని మిత్రవర్గంలో చేరిన యితర దేశాలకు అమెరికాలోని ఫ్యాక్టరీలు, నౌకా నిర్మాణశాలలు జబాబు చెప్పగలవు. జపానులో కన్న 15 రెట్లు ఎక్కువ ఉక్కు అమెరికాలో తయారగును. యూరోపు దేశాలన్నింటిలో తయారయే వాటికన్న ఎక్కువ యుద్ధ యంత్రాలు ఇంజనులు అమెరికాలో తయారుకాగలవు. ఇపుడు అమెరికా ప్రజలంతా తీవ్రక్రోధావేశంలో పడ్డారు. ఈ మహాశక్తి ముందర పశిఫికు సముద్రంలో జపానువారి స్వల్ప విజయములు సూర్యుని ముందర దిమిటీలవలె నుండగలవు.

# స్త్రీలు టాంకులను తయారుచేయుట.



బ్రిటనులో టాంకులు తయారుచేసే ఫ్యాక్టరీలయందు స్త్రీలు పనిచేయుచున్నారు. ఉత్తర భాగమునందొక ఫ్యాక్టరీలో 400 మంది స్త్రీలు పనిచేయుచున్నారు. వారికి ముందుగ ఒక నెల శిక్షణ యొసంగబడును. అట్టివారు నల్గురు ఒక టాంకువద్ద పనిచేయుట యీ పటమున కానవగును.

---

నౌకలు, టాంకులు విమానాలతో యీ యుద్ధంలో విజయం పొందాలి. అందుచే వీటన్నింటిని బ్రహ్మాండంగా తయారుచేయుటకు నిశ్చయించబడెను. చీనా, రష్యా దేశాలకు పశిఫిక ప్రాంతములందున్న సైన్యములకు ఆయుధ సామగ్రి యుద్ధమారణ యంత్రాలు పూర్తిగ పంపబడుచున్నవి. పశిఫిక సముద్రంలో యిపుడు మిత్రమండలి వారు వ్యవధిలేక తంటాలు పడుచున్నారు. త్వరలో వారి కనుకూలంగా పరిస్థితులు మారగలవు. స్వాతంత్ర్య సంస్థాపనకు విజయమునకు అమెరికా అప్పుడే పూచీపడింది. యూరోపులో జర్మనీచే ఆక్రమింపబడిన దేశాలలో నాజీదౌర్జన్యాన్ని నిరోధించి తిరుగబడుటకు ప్రజలు సిద్ధపడినపుడు వారికి సహాయంగాగూడ ఆయుధాలు పంపుటకు అమెరికా నిశ్చయించింది. విమానాల విషయం చూద్దాం.

నెలకు జర్మనీ 2,250, ఇటలీ 690, జపాను 850, అంటే మొత్తం యీ మూడు దేశాలు నెలకు 4,000 మాత్రం విమానాలు తయారు చేయగలవని చెప్పబడుచున్నది.

బ్రిటను, అమెరికా, సోవియట్ రష్యాలు యిపుడు జర్మనీ-ఇటలీ-జపానులకన్న అనేకరెట్లు అధికంగా విమానాలను తయారు చేస్తున్నవని తెలిసినవారు నమ్మకంగా చెబుతున్నారు. డిశంబరు మాసంలో ఇంగ్లాండు ఒంటరిగా పశిఫిక ప్రాంతములలోగూడ బాధ్యతను పూర్తిగ వహింపజాలకుండెను. కాని యిపుడు అమెరికా-ఇంగ్లాండు సహాయం లేకుండానే ఆ లోటుతీర్చి, శత్రుదేశాల ఉత్పత్తిని మించిపోగలదు. ఈ యేడాదిలోగా 60,000 విమానాలు, 80 లక్షల టన్నుల బరువుగల నౌకలు, 45,000 టాంకులు నిర్మించాలని అమెరికా ప్రయత్నించుచున్నది. ఇంకా యెక్కువ చేయడానికిగూడ యేర్పాటులు చేయుచున్నది. అమెరికా కార్మికులు యీ కార్యంలో పూర్తిగ తోడ్పడతామన్నారు. అమెరికా ప్రజలందరి ఉత్సాహంచూస్తే యీ ప్రకారం వారు తప్పక తయారు చేయగలరని తలంపవచ్చును.

# మూడు భారతీయ పటాలములు.

## మలయాలో అద్భుతముగ పోరుట.

మూడు భారతీయ పటాలములు మలయాలో అత్యద్భుతముగ యుద్ధంచేసి పేర్గాంచెనని, వెంటనున్న ఒక విమర్శకుడు తెలిపెను.

రాత్రి కాపలా కార్యములందు పేరుపొందిన గూర్ఖా జట్లు "గాంగు" లనబడుదురు. వీరు రాత్రులందు కుక్రి, కత్తులు పుచ్చుకొని బయలుదేరి తిరిగివచ్చిన పుడవి రక్తంలో తడవందిరారు. స్లిమునదియందు సుందర జట్టు సేనను శత్రువుల టాంకులు ఓడించిన తరువాతగూడ తక్కువ సంఖ్యగనున్న హైదరాబాదు రెజిమెంటునందలి ఒక పటాలము చాల ప్రశంసార్హముగ పోరాడెను.

మలయాలో కొద్దిరోజులనుండి ప్రారంభమయిన యుద్ధము చాల కష్టంగా నుండెననుటకు సందేహం లేదు. పడమటి తీరాన్ని జపాను సేనలు చీకాకుపరచుటకే దిగినందున, అదివరకంతా యుద్ధరంగంలోనుండి విశ్రాంతికి పోనున్న సేనలు తిరిగి వెంటనే యుద్ధం చేయవలసివచ్చెను. "ఇండియను సిపాయిలకు కారణాలు చెప్పకుండ వున్న చోటునుండి కదలిపొమ్మని ఉత్తరవులు తరుచు యిస్తువుంటే అబ్బురమొందెదరు. కాని కడుపునిండా భోజనంపెట్టి కొంచెం నిద్రకు అవకాశమిచ్చినచో వెంటనే ఏ పనికేనా తయారుగా నుంటారు" అని ఒక సేనాధికారినుడివెను.

నేపరు మైనరు దళములు సైన్యాలకు ముందు నడుస్తూ మార్గం సదునుచేస్తు వుంటాయి. వీరు శత్రువు యింకో క్షణంలో వస్తాడనగా వంతెనలు, రైలు రోడ్లు నిర్మూలంచేసి వారికి నిరోధం కలిగించుటయందు కడునేర్పుగ ప్రవర్తించిరి. భారతీయ రైల్వే దళములు యీ నిర్మూలన కార్యములందు పనిచేసినవి.

భారతీయ సివిలు వైద్యులు ప్రత్యేక ప్రశంసాపాత్రులు. అర్హులగు వైద్యులు పలువురు లేనందున, ఉన్నవారిని వారి యిష్టం లేకుండానే ప్రథమ శ్రేణి యుద్ధరంగములనుండి వెనుకకు పంపవలసివచ్చేది. వారిస్థానే భారతీయ అసిస్టెంటు వైద్యులు బాగానే పనిచేసేవారు. కోలాలంపూరునందు జనరలు ఆస్పత్రినుండి గాయపడినవారిని వైద్యులతో సహా పంపివేయవలసివచ్చింది. 15 మంది బిడ్డలు 150 సివిలు రోగులకు చికిత్సచేయుటకు ఇద్దరు భారతీయులగు వైద్యులు అక్కడ వుండిపోయిరి. జపాను సేనలు వచ్చిపడతాయని వారికి భయమేలేదు. తిరిగి బ్రిటిషు సేన లానగరాన్ని ఆక్రమిస్తాయని వారికి నమ్మకమే. ఆస్ట్రేలియా దేశీయుడగు ఒక వైద్యుడు పినాంగునుండి పంపివేయబడెను. తనక్రిందనున్న భారతీయ సిబ్బంది చాల అద్భుతంగ పనిచేసెననియు, శత్రువుల బాంబులు వర్షం కురిసినట్లు పడుతున్నా చలించ లేదనియు, ఆతడు చెప్పెను.

---

# తెలుసుకోదగ్గ విషయాలు.

**భారతదేశంనుండి విదేశాలందు** యుద్ధ రంగాలకును, యుద్ధంజరిగే సూచనగల దేశాలకు అపుడే 2,00,000 మందిపైగా సైనికులు పంపబడిరి. భారతదేశం సైన్యం సంఖ్య త్వరగా 10 లక్షలవరకు పెరుగుచున్నది.

* * *

**భారతీయ సైన్యంలో క్రొత్త సైనికులు** వారానికి 50,000 వంతున చేర్చుకొనబడుచున్నారు. యుద్ధం ప్రారంభమయిన ఎనిమిది నెలలలో 53,000 క్రొత్త అభ్యర్థులు చేర్చుకొనబడిరి. 1940 వ సం॥ మే మాసంలో, ఆధునిక యంత్రసామగ్రి నుపయోగించగల క్రొత్త సైన్యాన్ని 1,00,000 చేర్చాలని ఉత్తరువు చేయబడెను. 1940 వ సం॥ నవంబరు సరికి యించుమించు ఆసంఖ్య అంతా చేర్చుకొనబడెను.

1941 వ సంవత్సరమునందు క్రొత్త కార్యక్రమం ప్రారంభించిరి. మార్చి 23 వ తేది సరికి మన సేనల సంఖ్య 5,00,000 వరకు (పైదేశాలకు పంపబడినవారుకాక) పెరిగినదని ప్రకటింబడెను.

* * *

**శిక్షణ.**—ఇండియా సైన్యమునందు అత్యవసరోద్యోగములకు చేర్చుకొనబడినవారి శిక్షణకాలం తగ్గించబడెను. సాధారణంగా 18 నెలలు శిక్షణయుండేది. ఇపుడు 18-18½ సంవత్సరముల మధ్య యీడు యువకులకు ఒక యేడాది శిక్షణ యొసంగబడుచున్నది. 18½ సంవత్సరములకు పైబడిన అభ్యర్థులు, తగిన విద్యయున్నచో ఇండియను మిలిటరీ అకాడమీయందుగాని, ఆఫీసరుల ట్రెయినింగు స్కూలునందుగాని మోవు నగరంలోనో బెంగుళూరునందో ఏడు నెలలు మాత్రమే శిక్షణ యొసంగబడి యుద్ధానికి పంపబడుచున్నారు. ఈ పద్ధతివలన భారతీయ సైనికోద్యోగుల సంఖ్య నూటికి నూరు చొప్పున హెచ్చగలదు.

**వైమానికుల శిక్షణ.**—ఇండియను ఎయిరుఫోర్సు వాలంటీరు రిజర్వునందు తయారయినవారు శిక్షణ పొందుచున్నవారు కలసి శాంతి సమయంలోకన్న యిపుడు ఎనిమిది రెట్లు అధికముగా ఉన్నారు 1940 వ సంవత్సరములో ప్రారంభింపబడిన కార్యక్రమం ప్రకారం ఏడాదికి 300 వైమానికులను, 2,000 మంది నేలను పనిచేసే ఉద్యోగులను రెండేండ్లవరకు తయారుచేయుటకు నిశ్చయించబడెను.

**ఎక్కువమంది వైద్యులు ఇండియను మెడికలు** సర్వీసునందు చేర్చుకొనబడిరి. 1914-18 వ సంవత్సరముల ఐరోపా మహా యుద్ధంలో నాలుగేండ్లలో చేర్చుకొనబడిన

హారికన్న గడచిన రెండేండ్లలో చేర్చుకొనబడినవారి సంఖ్య యెక్కువ. యుద్ధం ప్రారంభమయిన 1939 వ సం॥ సెప్టెంబరు 1 వ తేది నాటికి ఐ.ఎం.ఎస్. లో 390 మంది యూరోపియ వైద్యోద్యోగులు, 240 భారతీయ వైద్యోద్యోగులుండిరి. 1941 వ సం॥ జనవరికి యీ సర్వీసులో భారతీయోద్యోగులకన్న యూరోపియను ఉద్యోగుల సంఖ్య రెండింతలు కలదు.

* * *

**వైద్య చికిత్సకు కావలసిన సరకులలో నూటికి 60** వంతులు యిపుడు ఇండియాలోనే తయారగుచున్నది. యుద్ధం ప్రారంభంనాటికి 25 వంతులు మాత్రమే తయారయ్యేది, మిగిలినది విదేశాలనుంచి దిగుమతి అయ్యేది.

సాధారణంగా మిలిటరీ ఆస్పత్రులకు సప్లైచేసేసరకుకన్న యిరువదిరెట్లు ఎక్కువ వైద్యసామానులు 1941 వ సం॥ జూన్ సరికి సప్లైచేయబడెను. దూరప్రాచ్యమునందు సైన్యాలన్నింటికి కావలసిన మందులు యితర వైద్యసామానులన్నింటిని పంపుటకును, ఇండియాలో తయారయే వైద్యసామానులన్ని మధ్యప్రాచ్యమునకు పంపుటకును ఇండియా బాధ్యత వహించగల్గింది.

* * *

**రాయలు ఇండియను నౌకాదళం** యుద్ధం ప్రారంభమయి నాక ఆరురెట్లు పెరిగింది. రాయలు ఇండియను నేవీకి (నౌకాదళమునకు) సంబంధించిన నౌకలు ఎర్రసముద్రము, పెర్షియనుగల్ఫు, అట్లాంటికు సముద్రములందు యుద్ధములలో పాల్గొన్నవి. ఈ నౌకాదళం భారతదేశం సముద్రములందు వాణిజ్య రక్షణకే ఉద్దేశింపబడింది. అయినాకూడా పైన తెలిపిన యుద్ధాలలో పాల్గొన్నది.

* * *

**భారత దేశీయ సంస్థానములుకూడ** ఇండియా సైన్య వృద్ధికి తోడ్పడినవి. వారి సైన్యం 1938 వ సంవత్సరములో 45,000 సిపాయిలతో కూడియుండెను. 1941 వ సం॥ ఆగస్టులో 76,000 వరకు పెరిగింది.

## భారత దేశం క్రొత్త సేనాధిపతి.

ఇండియా సర్వసేనాధిపతిగ జనరలు వావెలుగారి స్థానే సర్ ఆలను ఫ్లెమింగు హార్ట్లే, కె.సి.ఎస్.ఐ., సి.బి., డి.ఎస్.బి., గారిని నియమించిరి. సర్. ఆలన్‌గారు ఇండియా సైన్యమునందు చాలా ముఖ్యమగు పెద్ద ఉద్యోగములను బాధ్యతగలవి నిర్వహించియున్నారు. ప్రస్తుతం పశ్చిమోత్తర సరిహద్దువద్ద సేనానాయకులుగ నుండిరి. అచట ఇండియా రక్షణకార్యములను ఆధునిక పద్ధతిని దిట్టపరచుచుండిరి. వీరికి యీ దేశంతో చాల పరిచయం కలదు. రావల్పిండి, వజీరుస్థానం, న్యూ ఢిల్లీలందు యిదివరకు పనిచేసిరి. వీరు ఇరాకులోకూడ పనిచేసియున్నారు. ఆ అనుభవంకూడ వీరికి బాగుగ తోడ్పడగలదు. ఇరాకు-ఇరానుల రక్షణ బాధ్యత ఇటీవలవరకు భారతీయ సేనాధిపతిపైనే యుండును. కాని ఇపుడది మధ్యప్రాచ్యమునందలి బ్రిటిషు సేనానికి మార్చబడినది. ఇండియాకు దూరపు రక్షణశ్రేణియగు ఇరాకు ఇరానులందు బ్రిటిషు సేనానాయకుడగు సర్ అచినులేకుగారు అదివరకు ఇండియా సేనాధికారిగా నుండినవారే. ఇండియాకు తూర్పున రక్షణ శిబిరమగు సింగపూరువద్ద సేనాధిపత్యం వహించిన సర్ ఆర్చిబాల్డు వావెలుగారును ఇండియా సేనాధికారిగ నుండినవారే. కావున యిపుడు యీ మూడు రంగాలలో నున్న బ్రిటిషు సేనాధికారులు ఇండియాతో స్వంత పరిచయము అనుభవంగలవారే. ముగ్గురును ఈ రాకు ప్రాంతములందు శత్రుదేశాల యుద్ధనీతిస్వయంగా గమనించినవారే యగుటచేత ఇండియా రక్షణకు యెటువంటి లోటు వుండనేరదు.

జనరల్ హార్ట్లీగారి వయస్సు 59 సం॥లు. 1901-02 సంవత్సరములలో దక్షిణాఫ్రికా యుద్ధమున పనిచేసిరి. గత మహా యుద్ధమునందు వీరు ఫ్రాంసు, బెల్జియం, గ్రీసు, బల్గేరియా, టర్కీ, ఇరాకులలో పనిచేసిరి. తరువాత ఇండియా ఆర్మి హెడుక్వార్టర్సునందు డైరెక్టరు ఆఫ్ మిలిటరీ ఆపరేషన్సు అండు ఇంటలిజెన్సు ఉద్యోగమునందుండిరి. నిరుడు సరిహద్దు రాష్ట్రమునందు పెద్ద యెత్తున భారతీయ సైనిక ప్రదర్శనములను యేర్పాటుచేసి నిర్వహించినపుడు ఇండియా జాతీయ రక్షణ సంఘ సభ్యులు చూచి వీరి కృషిని మిగుల కొనియాడిరి.

## ఇండియాలో విమానాలు తయారుచేయుట.

ఇండియాలో విమానాలు తయారుచేసే పరిశ్రమ మొదటిసారి యీ యుద్ధంలో స్థాపించబడినది. విమానాలకు కావలసిన యంత్ర సామగ్రి తయారుచేయుటకు ఇండియాలో వీలున్నదేమోనని 1940 వ సంవత్సరము ప్రారంభములోనే ఎయిరు క్రాఫ్టు చీఫ్ ఇన్‌స్పెక్టరుగారు విచారణ చేసిరి. తగిన ఉక్కు లభించదు; యంత్రపు పనిముట్లు దొరకవు; అమెరికానుండి యీ సామగ్రి దిగుమతి చేసుకొనుటకు అనుమతియుండాలి. ప్రభుత్వంవారు తయారయిన సరకంతా కొంటేగాని యీ పరిశ్రమ కొనసాగించుటకు ఎవ్వరు పూనుకొనకుండిరి. ఇటువంటి చిక్కులన్ని అప్పు డుండెను. ఎట్లయితేనేమి యీ చిక్కులన్ని తొలగించబడెను. టాటా కంపెనీనారు తగిన ఉక్కు తయారుచేయుట నేర్చిరి; అందుకవసరమగు మిశ్రపు లోహములను దిగుమతి చేసుకొనుచుండిరి. విమానాల వుత్పత్తికి అవసర

మగు యంత్రాలు అనేకచోట్లనుండి, చివరకు చీనానుండి కూడ లభించెను. అమెరికా యంత్రపు పనిముట్లు పంపుటకు అంగీకరించెను. యంత్రాలు నడిపించే నేర్పరులు అమెరికానుండి వచ్చిరి. అమెరికా కంపెనీలతో కంట్రాక్టులు సంతకములయినవి. దక్షిణ ఇండియాలో ఒక ప్రైవేటు కంపెనీ స్థాపించబడెను. ఇది ప్రైవేటు కంపెనీయే అయినా ప్రభుత్వంవారు యిందులో $\frac{1}{3}$ వంతు వాటాలు కొన్నారు. కంపెనీ పరిపాలకవర్గమునందు వారికి ప్రాతినిధ్యం గలదు.

ఈ కంపెనీయొక్క కర్మాగారమునందు మొదటి విమానం 1941 వ సంవత్సరంలో బయలుదేరింది. ఇప్పటికిని యీ కర్మాగారమునందు విదేశాలనుండివచ్చు వేరువేరు భాగాలు జతచేసి అమర్చి విమానం తయారుచేయుటే జరుగుచున్నది. ఇంక కొంతకాలంవరకు అట్లు జరుగవలసిందే. క్రమేణ నిపుణులగు పనివారు యిందు తయారగుచున్నారు. కొన్ని విమాన భాగాలను ఇండియాలోని వస్తువులనుండే తయారుచేయుటకు త్వరలో వీలగును. అమెరికా "హార్లో" రకం విమానములున్ను, "కర్టిసు హాకు" రకం విమానములున్ను యిందు సమకూర్చబడుచున్నవి. మొదటి రకం వైమానికుల శిక్షణకు పనికివచ్చును, రెండోది మంచి ఫిరంగులుగల యుద్ధవిమానం. "వాల్టీ" అను బాంబులువేసే విమానాలుకూడ యీ కర్మాగారంలో తయారుచేయుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. అవసరం వచ్చినపుడు పెద్ద మరమ్మత్తులుగూడ యీ ఫ్యాక్టరీయందు చేయబడగలవు.

విమానాలు నడుపుటకు మామూలు మోటారుల కుపయోగించు పెట్రోలుకాక, వేరే రకం పెట్రోలు ఉండాలి. అదికూడ ఇండియాలో ఉత్పత్తి చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. విమానదళాలకు కావలసిన లూబ్రికేటింగు ఆయిలు (చమురు) కూడ ఇండియాలోనే తయారుచేయుటకు పరిశోధనలు చేయుచున్నారు. ఇంతవరకు యీ సరకు బర్మానుండి, ఇరానునుండి తెప్పించుచున్నారు. కొంత పెట్రోలు ఇండియాలోనే వుత్పత్తి చేయుచున్నారు.

---

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.
[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]